# అథ ఏకోనత్రింశో %ధ్యాయః

## ఆదిసృష్టి వర్ణనము

శౌనక ఉవాచ|

శ్రుతం మే మహదాఖ్యానం యత్త్వయా పరికీర్తితమ్|
సనత్కుమారకాలేనయసంవాదం పరమార్థదమ్||1

అతో% హం శ్రోతుమిచ్ఛామి యథా సర్గస్తు బ్రహ్మణః |
సముత్పనన్నం తు మే బ్రూహి యథా వ్యాసాచ్ఛతే శ్రుతమ్||2

శౌనకుడు ఇట్లు పలికెను-

సనత్కుమారవ్యాససంవాదము పరమపురుషార్థమగు మోక్షమునిచ్చే గొప్ప గాథ. దానిని నీవు కీర్తించగా నేను వింటిని (1). బ్రహ్మనుండి ఈ సృష్టి ఉద్భవించిన తీరును నేను ఈ పైన వినగోరుచున్నాను. నీవు విషయమును వ్యాసుని నుండి వినియుంటివి. దానిని నాకు చెప్పుము(2).

సూతు ఉవాచ|

మునే శృణు కథాం దివ్యాం సర్వపాపప్రణాశినీమ్| కథ్యమానాం మయా చిత్రాం బహ్వర్థాం శ్రుతివిస్తరామ్||3

యశ్చైనాం పాఠయేత్తాం చ శృణుయాద్వా%ప్యభీక్ష్ణశః|
స్వవంశధారణం కృత్వా స్వర్గలోకే మహీయతే||4

ప్రధానం పురుషో యత్తన్నిత్యం సదాసదాత్మకమ్| ప్రధానపురుషో భూత్వా నిర్మమే లోకభావనః || 5

స్రష్టారం సర్వభూతానాం నారాయణపరాయణమ్| తం వై విద్ధి మునిశ్రేష్ఠ బ్రహ్మాణమమితౌజసమ్||6

యస్మాదకల్పయత్కల్పాన్ సమగ్రాశ్చచయో యతః| భవంతి మునిశార్దూల నమస్తస్మై#ై స్వయంభువే||7

తస్మై#్మ హిరణ్యగర్భాయ పురుషాయేశ్వరాయ చ| నమస్కృత్య ప్రవక్ష్యామి భూయస్సర్గమనుత్తమమ్||8

బ్రహ్మ స్రష్టా హరిః పాతా సంహర్తా చ మహేశ్వరః| తస్యసర్గస్య నాన్యో% స్తి కాలే కాలే తథా గతే|| 9

సో% పి స్వయం భూర్భగవాన్ సిసృక్షుర్వివిధాః ప్రజాః | అప ఏవ ససర్జాదౌ తాసు వీర్యమవాసృజత్||10

అపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః | అయనం తస్య తాః పూర్వం తేన నారాయణఃస్మృతః|| 11

హిరణ్యవర్ణమభవత్తదండముదకేశయమ్| తత్ర జజ్ఞే స్వయం బ్రహ్మ స్వయం భూరితి విశ్రుతః||12

హిరణ్యగర్భో భగవానుషిత్వా పరివత్సరమ్| తదండమకరోద్ద్వైధం దివం భూమిం చ నిర్మమే||13

అధో%ధోర్ధ్వం ప్రయుక్తాని భువనాని చతుర్దశ| తయోశ్శకలయోర్మధ్య ఆకాశసృజత్ప్రభుః||14

అప్సు పారిప్లవాం పృథ్వీం దిశశ్చ దశాధా భువి | తత్ర కాలే మనో వాచం కామక్రోధావథో రతిమ్ || 15

మరీచిమత్ర్యం గిరసౌ పులస్త్యం పులహం క్రతుమ్| వసిష్ఠం తు మహాతేజాస్సో%సృజత్సప్త మానసాన్ || 16

సూతుడు ఇట్లు పలికెను-

ఓ మునీ! సకల పాపములను పోగొట్టునది, చిత్రమైనది, గంభీరమగు అర్థముగలది, ప్రఖ్యాతిని గాంచిన విశేషములు గలది అగు దివ్యగాథను నేను చెప్పుచున్నాను. నీవు వినుము(3). ఎవడైతే ఈ కథను పఠింపజేయునో, లేదా పలుమార్లు వినునో, వాడు తన వంశమును నిలబెట్టుకొని స్వర్గలోకములో మహిమను గాంచును(4). ఎది ప్రధానమో అదియే పురుషుడు అదియే నిత్యము. ప్రధానము కార్య కారణరూముగా నుండును. ఓ మహర్షీ! లోకమును నిర్మించిన

పరమేశ్వరుడు జడప్రకృతిగను, మరియు చేతనపురుషుడుగను తానే అయి, సర్వభూతములను సృష్టించినవాడు, నారాయణుని శరణు జొచ్చినవాడు, సాటినలేని తేజస్సు గలవాడు అగు ఆబ్రహ్మను సృష్ఠించినాడని తెలుసుకొనుము(5,6). ఎవనినుండి బ్రహ్మగారు కల్పములను సృష్ఠించెనో, సర్వప్రాణులు ఎవరినుండి ఉద్భవించునో ఎవడు స్వతంత్రమగు సత్తగలవాడో, అట్టి పరమేశ్వరునకు నమస్కారము(7). చేతనపరంబ్రహ్మకు, మయోపాధికుడగు ఈశ్వరునకు మరియు ప్రథమజీవుడగు హిరణ్యగర్భునకు నమస్కరించి నేను సర్వశ్రేష్ఠమగు సృష్టిని గురించి మరల చెప్పగలను(8). సృష్ఠిని చేయువాడు బ్రహ్మఅనియు, పాలించువాడు హరి అనియు, సంహరించువాడు మహేశ్వరుడనియు అనబడును. కాలము ఉండే స్థితియందు కాలము తొలగిపోయే ప్రళయమునందుఈ సృష్ఠికి మూలము మరియొకరు లేరు(9). స్వయముగా ప్రకటమైన పూజ్యుడగు ఆ హిరణ్యగర్భుడు వివిధప్రాణులను సృష్టించగోరి మున్ముందు నీటిని మాత్రమేసృష్ఠించి వాటియందుతన శక్తిని నింపెను (10). జలములకు నారములు అని పేరు జలములు నరుని(పరమేశ్వరుని) సృష్ఠి పూర్వము ఆయన వాటియందు నివసించుటచే, ఆయనకు నారాయణుడని పేరు వచ్చినది (11). జలములో నిక్షిప్తము చేయబడిన ఆ తేజస్సు బంగరు వర్ణముగల (తేజోమయమైన) అండము అయెను. దానియందు స్వయముగా బ్రహ్మపుట్టి స్వయంభువుడు అనిప్రఖ్యాతిని గాంచెను(12). ఆ హిరణ్యగర్భ(బ్రహ్మ) భగవానుడు అచటనే సంవత్సరముకాలము నివసించి ఆ అండమును రెండుగా చేసి స్వర్గమును మరియు భూలోకమును నిర్మించెను(13). కింద పైన కలిపి పదునాలుగు లోకములు ప్రవర్తిల్లినవి. సర్వసమర్థుడగు బ్రహ్మ ఆ రెండు ముక్కల మధ్యలో ఆకాశమును సృష్టించెను(14). అచట కాలక్రమములో నీటియందు తేలియాడే భూమిని, ఆకాశమునందు పది దిక్కులను, మనస్సును, వాక్కును, కామక్రోధములను మరియు సుఖానుభవమును సృష్టించెను(15). గొప్ప

తేజశ్శాలియగు ఆ బ్రహ్మ మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు అనే ఏడుగురు మానసపుత్రులను సృష్టించెను(16).

సప్త బ్రహ్మాణ ఇత్యేతే పురాణ    నిశ్చయం గతాః |
తతో%సృజత్పునర్బ్రహ్మా రుద్రాన్ క్రోధసముద్భవాన్||17

సనత్కుమారం చ ఋషిం సర్వేషామపి పూర్వజమ్ | సప్తచైతే ప్రజాయంతే పశ్చాద్రుద్రాశ్చ సర్వతః ||18

అతస్సనత్కుమారస్తు తేజస్సంక్షిప్య తిష్ఠతి | తేషాం సప్త మహావంశా దివ్యా దేవర్షిపూజితాః ||19

ప్రజాయంతే క్రియావంతో మహర్షిభిరలంకృతాః|
విద్యుతో%శనిమేఘాంశ్చ రోహితేంద్రధనూంషి చ||20

పయాంసి చ ససర్జాదౌ పర్జన్యం చ ససర్జ హ| ఋచో యజూంషి సామాని నిర్మమే యజ్ఞసిద్ధయే ||21

పూజ్యాంస్తై#ౖరజయన్దేవానిత్యేవమనుశుశ్రుమ |
ముఖాద్దేవానజనయత్పితౄంశ్చైవాథ వక్షసః |

ప్రజనాచ్చ మనుష్యాన్వై జఘనాన్నిర్మమే %సురాన్ ||22

ఉచ్చావచాని భూతాని గాత్రేభ్యస్తస్య జజ్ఞిరే | ఆపవస్య ప్రజాస్సర్గం సృజతో హి ప్రజాపతేః ||23

సృజ్యమానాః ప్రజాశ్చైవ నావర్ధంత యదా తదా| ద్విధా కృత్వాత్మనో దేహం స్త్రీ చైవ పురుషో% భ##వేత్||24

ససృజే% థ ప్రజాస్సర్వా మహిమ్నా వ్యాప్య విశ్వతః|
విరాజమసృజద్విష్ణుస్స సృష్టః పురుషో విరాట్||25

ద్వితీయం తం మనుం విద్ధి మనోరంతరమేవ చ | స వైరాజః ప్రజాస్సర్వాస్ససర్జ పురుషః ప్రభుః||26

నారాయణవిసర్గస్య ప్రజాస్తస్యాప్యయోనిజః | ఆయుష్మాన్ కీర్తిమాన్ ధన్యః ప్రజావాంశ్చాభవత్తతః|| 27

ఇత్యేవమాదిసర్గస్తే వర్ణితో మునిసత్తమ| ఆదిసర్గం విదిత్త్వైవం యధేష్ఠాం ప్రాప్నుయాద్గతిమ్||28

ఇతి శ్రీ శివమహాపురాణ ఉమాసంహితాయాం ఆదిసర్గవర్ణనం నామ ఏకోనత్రింశో%ధ్యాయః(29).

వీరు పురాణములో సప్తబ్రహ్మలు అని ప్రఖ్యాతిని పొందినారు. తరువాత బ్రహ్మ కోపమునుండి ఉదయించే రుద్రులను సృష్ఠించెను(17). బ్రహ్మ అందరికంటె ముదంగా సనత్కుమారమహర్షిని సృష్ఠించెను. తరువాతనే సప్తర్షులు, రుద్రులు మరియు సర్వము సృష్ఠించబడెను (18). ఇందువలననే, సనత్కుమారుడు తన తేజస్సును కుదించుకుని యుండెను. ఆ ఏడుగురు ఋషులకు ప్రకాశవంతములు, దేవతలచే మరియు ఋషులచే అలంకరించబడినవి అగు ఏడు వంశములు ఉదయించెను. తరువాత ఆయన ముందుగా మెరుపులను, పిడుగులను, మేఘములను, సంధ్యను, ఇంద్రధనస్సును, జలములను సృష్ఠించి, యజ్ఞములు సిద్ధించుట కొరకై ఋగ్వేద, యజుర్వేద, సామవేదములను నిర్మిచెను(19-21). మానవులు ఆ ఋగ్యజుస్సామవేదముల ద్వారా పూజ్యులగు దేవతల నారాధించినారని వేదమదమంత్రములలో వినుచున్నాము. ఆయన ముఖమునుండి దేవతలను, వక్షఃస్థలమునుండి పితృదేవతలను, సంతానప్రక్రియచే మానవులను, పొత్తి కడుపు భాగమునుండి రాక్షసులను నిర్మించెను(22). జలము నుండి పుట్టి ప్రజాపతియై ప్రజలను సృష్టించిన బ్రహ్మయొక్క అవయవములనుండి చిన్న-పెద్ద ప్రాణులు పుట్టినవి(23). ఈ విధముగా సృష్టించడిన ప్రాణులు ఎప్పుడైతే వర్ధిల్లలేదో, అప్పుడు ఆయన తన దేహమును రెండుగా చేసి స్త్రీ మరియు పురుషుడు ఆయెను(24). తరువాత ఆయన విశ్వమునువ్యాపించి సమస్తప్రాణులను సృష్టించెను. విష్ణువు విరాట్ ను సృష్టించెను. ఆ విధముగా సృస్టిచబడిన ఆ విరాట్పురుషుడే రెండవమనువు అని

తెలియుము. ఆయననుండియే మన్వంతరము ఏర్పడినది సర్వసమర్ధుడగు ఆ విరాట్పురుషుడు సకల ప్రజలను సృష్టించెను(25,26). నారాయణుని విశేషసృష్టి యగు ఆ మనువునకు కూడ సంతానము కలిగిరి. అయోనిజుడు, ఆయుష్మంతుడు, కీర్తిమంతుడు మరయు ధన్యుడు అగు ప్రజాపతి ఆయననుండి ఉదయించెను(27). ఓ మహర్షీ! ఈవిధముగా నేను నీకు ఆదిసృష్టిని వర్ణించితిని. ఈవిధముగా ఆదిసృష్టిని తెలుసుకొన్న వ్యక్తి తనకు అభీష్టమైన పుణ్యగతిని పొందును(28)

శ్రీ శివమహాపురాణములో ఉమాసంహితయందు ఆదిసర్గవర్ణనమనే

ఇరువది తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (29).